R

శ్రీ

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.
గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 7 } 1915 ఆగస్టు { సంచిక 8

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and Published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

# ప్రధానపోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 శ్రీ రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహాదరు జమీందారులు నూజవీడు

2 రాజా వెంకటాద్రిఅప్పారావు బహాదరు జమీందారుగారు, నూజవీడు

3 రాజా వాశిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహాదరు మన్నెసుల్తాన్ జమీందారుగారు ముక్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి

5 రామశింగుగారు నెల్లుట్ల షాపురపు సంస్థానము మేనేజరు నెల్లుట్ల

6 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు గుంటూరు

7 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చోల్లేరు

8 అనంతిరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట

9 గూడూరు వీరసాంబశివరావుసర్దేశపాండ్యాగారు, మాలెకొండూరు

## సహాయులు.

1 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి

2 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి

3 నరసింహాచార్యులుగారు-పట్వారి-కొలనుపల్లి

4 హనుమంత రెడ్డిగారు-క్షీరసాగరము

5 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి

6 అన్నమురాజు సుబ్బారావుగారునందూరు

7 నందూరు లక్ష్మీనరసింహారావుగారు, కరణం, నందూరు

8 నైషధము సీతాకాంతముగారు మొరంపూడి

19 మెదకు శేషారావు దేశముఖుగారు నల్లబల్లి

10 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాడవరము

11 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు

12 హెజిబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ

13 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద

# అభినవసరస్వతి

సంపుట. 7. { జానవాహు
రాక్షస సం॥ శ్రావణమాసము } సంచిక 8.

## కృతివిమర్శనము.

సౌగంధిక పుష్పాపహరణము:—ఇది నరసారావుపేట డిస్ట్రిక్టుమున్సిఫుకోర్టు గుమాస్తాయగు భువనగిరి బుచ్చిపరదేశిసోమయాజులుగారిచే తత్పుర నాటకసంఘము వారి నిమిత్తమై రచించియీయఁబడిన యొకదృశ్యప్రబంధము. గ్రంథకర్తయు నాటకసంఘమునం దొకమెంబరగుటచేఁ బ్రదర్శనమున కనుకూలముగురీతి మంచిశైలిలోనికి దీనిని దించెననుటకు సంశయముండదు దీనివిషయమై పూర్వమే మదభిప్రాయ మీక్రిందివిధమున నీయఁబడియున్నది.

క॥ నూతనముగ మీచేతఁ బ్రణీతంబగు నాటకంబు నేఁజూచితి సం
ప్రీతుండనైతిఁ గవితాచాతురికిన్ ధీసమేత సద్గుణజాతా!॥

ఉ॥ ముందుకుముందె వ్రాసితిరి ముద్దులుమక్కఁగ నాటకంబు, నే
మందునుదావకీనమయినట్టిమహాప్రతిభావిశేష, మా
నందపరీవృతుండనయినాఁడ, గమేశుకృపాప్రసక్తినీ
చందమిఁకెన్నొగ్రంథములఁ జయ్యనవ్రాసియశంబుఁబెంపుఁడీ॥

చ॥ ఇదిప్రథమప్రయత్నమయి యెంతయుసంతసముంబొనర్చెఁబో
మృదుపదభాసురంబగుచు మీరొనరించిననాటకంబు, పై
కొదవలలేమి, మేటికవికోటికెక్కల్గెడి, నెచ్చటేని త
ప్పొదవినఁ దప్పుగాదది బహుత్వమునందగుఁగాని చూడఁగన్॥

దీని వెల 0-8-0, గ్రంథకర్తవద్ద దొరకును.

కోటప్పకొండ ప్రహసనము:—ఇదియుఁ బైవారిచేతనే వ్రాయబడినది. ఇందుఁ గోటప్పకొండ తిరుణాళ్లకువచ్చు సాముకుల ప్రసంగములు చిత్రముగాఁ బ్రదర్శింపఁబడియున్నవి. గ్రంథకర్త హాస్యరసప్రదర్శనమందుఁగూడఁ సమర్థుఁడగుట బహుజనవిదితము. కావున నిప్రహసనము మనోహరముగనుండుననుటకు సంశయములేదు. దీని వెల 0-2-0. గ్రంథకర్తవద్దనే దొరకును.

విగ్రహారాధన.—ఇది తిరుపతి వెంకటేశ్వరవిరచితముగు గీరతమందలి 3 వభాగము. గీరత నిర్మాణమునకుఁ గారణభూతులు రామకృష్ణకవులనునది పలుమందికిం దెలిసినవిషయమే. తమకుశిష్యులయ్యుఁ దమ్ముధిక్కరించి కృతఘ్నులయినందున రామకృష్ణులను నీతిగఱపుటకై తి॥ వెం॥ లీగ్రంథముం బ్రారంభించిరి. అందు 1-2 భాగములలో

గలిపిననీతి రామకృష్ణుల విగ్రహారాధనవిముఖులఁగాఁజేసినది. ఐనను ది॥ వెం॥ కవులు పట్టుదలవదలక యింకను నీతిగలపుటయందే ప్రసక్తులై యీవిగ్రహారాధనమున్ రచించిరి. ఈయుద్యమమంతయు బూడిదెల్లోఁజేసిన పూర్ణాహుతియేకాని వేఱుకాదు. ఈసంగతి గ్రంథకర్తలకుఁ దెలియకకాదుగాని యుద్దిష్టుల నుపయోగించినను నుపయోగింపకున్నను నవశిష్టులకైన నక్కఱకువచ్చువిషయమని వ్రాసియుండనోపు. శ్రుతిస్మృతిపురాణశిష్టాచారసమ్మతమయిన యర్చారాధన యావశ్యకత యిందుఁ జక్కఁగా ప్రతిపాదింపఁబడినది. ఇది సంఘసంస్కారినామధారులకు సర్వాసహ్యము. అందువలనఁగదా తత్ప్రభృతులు తి॥ వెం॥ లకవిత్వము లోకోత్తరమైనదని యెఱింగియు లోపములు వెదుకనారంభించిరి. చదువరు లేతద్గ్రంథవైఖరిఁ గమనించుటకై యిందలికొన్ని పద్యము లుదాహరింతుము.

ఉ॥ వేదములందు లేదనుచు విగ్రహపూజనుమానిరంట యీ
వాదులుకొంద, అయ్యదియసత్యమయందము, మానుపూటమున్
సాదము మెక్కఁగల్గుఁడని సారెకు వేదము లేడ్చుచున్న వే
లేదట భక్తికిన్ విధి, యాళీకము గావది మానరావొకో ॥

చ॥ ఇతరకులస్థుఁడే మతము నేని గ్రహించిన సంస్కృష్టిలే
దతులము బ్రాహ్మణాన్వయము నందుదయించి పితామహాదుల
న్నితరులవోవుమార్గములు పిప్పిగనెంచి స్వతంత్రులైశ్రుతి
స్మృతిధృతిదూరమైనగతిఁజెందినవారియవస్థ చోద్యమా॥

ఉ॥ శంకరులొప్పినారుమతపట్టము, విగ్రహపూజ యందు ని
శ్శంకముపట్టమున్, జనులసంగతి నిప్పటియట్లు పాపపుం
బంకముగా జగంబు నిలుపన్ గమకించిన యార్యుఁడాతఁ డీ
శంకరుఁ బోఁడు వ్యాసమతసర్వరహస్యవిదుండు గాఁడొకో॥

ఉ॥ వ్యాసులవారు సూత్రముల బ్రహ్మముఁ దెల్పి పురాణమందుఁ ద
ద్భాసురచిద్విలాసములభంగులు దెల్పినవారు, సూత్రని
శ్వాసముమాపి తక్కఁగలసంగతులంద్యజియించువారు స
న్న్యాసులు, భ్రష్టులౌదురు గృహస్థు లటుల్ నరియింపఁబూనినన్॥

దీని వెల 0-8-0, వలయువారు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శారద ప్రెస్సు, బందరు. అని వ్రాసినవలెను.

ఓకలకంఠి! కస్మికలకంఠితా
 నవ్యపున్నాగవాంఛాస్థగనియె
అలర నోప్రమదామణి! యామదాళిఁ
 గాంచితివె చారుమధుపానకలితయయ్యె
అనుచుఁ దగ నర్మగర్భలీలాతిచతుర
 వచనరచనలఁ జెప్పె నవ్వనరుహాక్షి॥ 103

వ॥ మఱియు నొక్క మనోహరాంగి గంగాకురంగనయనాంతరంగంబునం దురంగలించు దురంతసంతాపం బుడుగఁ జేయుటకై చేయెత్తి యిట్లనియె॥ 104

సీ॥ కన్నెరో! చూచితే పొన్నగున్నలదండ
 లేవమీఱిన రావి క్రోవిమావి
గరితరో! చూచితే గరుగులమరుఁగులఁ
 జాలవ్రాలినపూలు రేలపాల
కొమ్మరో! చూచితే గొప్పయిప్పలక్రేవ
 లేగాలివడినూఁగు నోఁగురేఁగు
తెఱవ! చూచితె తేనెచెఱువులపొరువుల
 నుద్దిగన్నడు కొద్దిమద్ది వద్ది
ముదితరో! చూచితే యల్ల మొల్లలెల్ల
తరుణిరో! చూచితే కోగతాడి మేడి
చానరో! చూచితే నెమ్మిజమ్మి నెమ్మి
పొలఁతిరో! చూచితే పోఁక పోకమూక॥ 105

ఉ॥ ఈ యలతేటిమొత్తములు నీ మదకీరమయూరపంక్తి లీ
కోయిలపిండు హా కుసుమకోమలి! నీ నెఱికప్పవెండ్రుకల్
నీయలరారుపల్కులును నీగమనంబును నీమెలుంగు దాఁ
బాయక మెచ్చులీల ననవాయరవంబున మీఱెఁ గంటివే॥ 106

వ॥ అని బహుప్రకారంబులఁ బొందుపడ నిందీవరాక్షు లయ్యుం

దిందిరాలకాతిలకంబున కింపుపుట్టునట్టు లయ్యారామసీమంగలుగువిశేషంబులు చతురవచనరచనాచమత్కారంబులఁదెలుపుచువిహారణతత్పరలై వచ్చివచ్చివిశాలరసాలసాలమూలేందుకాంతాలవాలోద్గతాభ్యర్ణ సలిలస్రోత చిత్రజలశీకర పరంపరలం గాంచి బిత్తరంపుఁగ్రొత్తముత్తియమ్ములని కొన్నిచిన్ని పన్నిదంబులు చఱవఁజూచు ముగ్ధలగుచేడియలంగాంచి ప్రౌఢతనంబున ముసురువెసురుల మొదళ్లఁదొరఁగిన గొప్ప సుప్పాణిముత్తియమ్ములు కెందమ్ములచందమ్ములనందమ్ములుగలప్రశస్తహస్తపుటమ్ములం దెచ్చినఁ గురువిందబృందమ్ము లందురని తెలిచేలముల వలుదచెఱంగులం గొనితెచ్చి సందేహంబువారించుచు, కేళికాదీర్ఘికాపిచికామాలికాడోలికావిలోలకలహంసబాలికాపాళికలం గాంచి వంచించిపట్టందలంచుచు,పండ్లగుత్తుల మొత్తమ్ములు చిత్తమ్ములకింపుసేయ ద్రాక్షపందిళ్లసందులం దూరిచూచుచు అందంబులై సందులేక పొందుగలుగు బండిగురువిందతీఁగెచప్పరమ్ములపై ముప్పిరినల్లుకొనిన మొల్లతీఁగియలంగాంచి యురుదందుచు,పూగంబులఁ గాంచుచు; నాగంబుల నెంచుచు, వకుళంబుల డాయుచు, ముకుళమ్ములఁ గోయుచు, లుంగంబుల నెనయుచుఁ, దుంగంబులఁ దనియుచు, సాలమ్ముల మీఱుచుఁ, దాలమ్ములఁ గేఱుచు బహుప్రకారంబుల విహరించి; మఱియును,

సీ॥ కన్నెమావుల్ప్రేలు సన్నంపునునుదీఁగె
 తూఁగుటుయ్యాలల నూఁగియూఁగి
 తేటికోటుల మేటిపాటల వాటమౌ
 పూపొదరిండ్లపై మూఁగిమూఁగి
 నెలరాదొనల మంచుచిలుకు గొజ్జఁగిపొదల్
 బాగుగా తమవశి యూఁగియూఁగి
 బోరుననెడలేక పాతడివిరితేనె
 వాఁగులచెంతల డాఁగిడాఁగి
 కప్పురపసంటిచెంగట నొప్పుమీఱు
 బండిగురువిందతీఁగె చప్పరములందు

నెడ తెగని చల్లనీడల కేగియేగి
కోర్కెఁ గ్రీడించి రింతులు కొంద ఱలమి॥ 108

సీ॥ ఒకపక్వబింబోష్ఠి యొకకీరసల్లాప
నొనఁగూడి రాగాప్తి నుత్సహించె
ఒక నవ్యబిసబాహ యొకహంసగామిని
నొనఁగూడి కైదండ యొగి ధరించె
ఒక మహోత్పలగంధి యొక హస్తిహస్తోరు
నొనఁగూడి సామోదమునఁ జెలంగె
ఒకచక్రవక్షోజ యొకచంద్రబింబాస్య
నొనఁగూడి సరసనంయుక్తిఁ గాంచె
గీ॥ క్రమతరసాంకవామోదఘనఘనాఘ
నాంచితాలకబృందసింహావలగ్న
లలితఫణిరాజరోమాళిలతలవలన
సాంద్రనిర్వృతి వనకేళి సలుపునపుడు॥ 109

సీ॥ కలకంఠియొక్కర్తు కన్నె కెందలిరాకు
గుజ్జుమావులను జేకొనికడంగ
లతకూనయొక్కర్తు వితతమంజునికుంజ
సంచయంబుల నావరించుకొనఁగఁ
బద్మినియొక్కర్తు పరువంపువలపు క్రొ
వ్విరిదుమారము సారె ధరణిరాల్ప
అలరుకొమ్మయొకర్తు బలితంపుఁ దావుల
మకరందధార లుత్సుకతఁ గ్రోల
గీ॥ అపుడొకగయాళి "రామనామాంగుళీయ
కాబ్జశయలార! స్మరచంద్రహాసనత్క
టాక్షులార! రాజ్ఞముఖులార! దక్షిణాని
లోరునిశ్వాసలార! పై నురుకుఁ"డనియె॥ 110

తే॥ క్రొత్తచెంగల్వచిమ్మన గ్రోవినిండఁ
బూవుదేనియనింపి నేర్పుమెయి నొక్క-
సకియ గుత్తంపుగుబ్బలసందు దగులఁ
జిమ్మ నొకకొమ్మ యన్యలఁజేరనరిగె॥ 111

ఉ॥ కోరుచు నొక్క-కాంత చనుగొండలు సారెకుఁ జొకళింపఁగాఁ
బేరము వాఁటి యవ్వలను బెన్పొదఁజొచ్చి పొసంగి ముష్టిచేఁ
గోరికెఁ బచ్చకప్పురముఁ గొంచు వడింజని "మత్క-రమ్మునం
దారయ నేమియున్నయది యంబుజనేత్రలు! తెల్పుఁ"(డంచనన్)
వారలు వేఱ యొక్క- ఘనవస్తువుతెల్ప హసించెనెంతయున్॥ 112

క॥ ఈరీతి నాసఖీజను।లారామమునందు మిగుల నభిరామముగాఁ
గోరిక లీరికలెత్తఁగ।భూరిస్థితిఁ గ్రీడసల్పి పొడమిన వేడ్క-న్॥ 113

వ॥ పుష్పాపచయానురక్తిం దనరి తమలోన, 114

ఉ॥ "ఓకమలాభచారుముఖ! యోమదకీరవిలాసభాషిణీ!
యోకలకంఠి! యోరమణి! యోహరినీలవినీలకుంతలా!
యోకనకాంగి! యోసుదతి! యోమధురాధర! యోవిలాసిని!
యోకలహంసయాన"యని యొండొరుఁజీరుచు మీఱుచుబ్బుచున్॥

తే॥ "తరుణిరో! పూలనొప్పారెఁ దరువుఁగంటె
శ్యామరో! కోమలమ్ములౌ శ్యామ లివియె
కాంచనాంగిరో! యుల్లవె కాంచనములు
కుందరదనరో! కనుగొంటె కుందములను॥ 116

రగడ॥ పొగడ పొగడఁగఁద(గెను)ముందటఁ బూవు పూవుంబోణిపట్టకు
నగకు నగకుచ!యన్నుఁ(గనుగొని)నాతి! నా తిలకంబుముట్టకు
మాటిమాటికి వాదమాడుటమాని మానిని! యుండుమిచ్చట
పాట పాటలగంధి!ముద్దుగఁ బాడి పాడిగఁదెల్పు ముచ్చట
లేమ లేమఱియుండ నేటికి లేమ! లే మఱి యిచట మొల్లలు
రామ! రా మది రాక్షిపల్కు-లు రామరామ! తలంపఁ గల్లలు

ఈడ నీడను గంటినే నీ వేగి వేగను నెమకు కామిని!
వేడు వేడుకమీరఁగాఁ గురువేరు వే ఋణమిచ్చుభామిని!
కోకఁ గోకనదాంఘ్రిపట్టినఁ గోయ కోయలివేణి జాతులు
పోకు పోకు"మనంగ నేగిరి పొదలుపొదలుకనంగ నాతులు॥ 117

సీ॥ శ్రీరామనామోర్మికారమ్యసంపత్తి
కలకంఠముల హాళాహాళులుమాన్చి
కమనీయసహజ సాంకవముదామోదంబు
చిలుకపంక్తుల నళాపళియణంచె
కాంచనపుష్పప్రకాశ నాసాలక్ష్మి
గండుతుమ్మెదల యఘాఘుళము చెఱచె
నవమందహాస కందళిచంద్రికాభూతి
స్థలపద్మముల వికాసంబుగూల్చె
సురుచిరసుగంధబంధుర సుమగుళుచ్ఛ
పిచ్ఛిలాచ్ఛాచ్ఛమకరంద బిందుబృంద
సుందరారామవీథి నస్తోకలీల
సతులుపుష్పాపచయకేళి సలుపునపుడు॥ 118

సీ॥ సరసిజాసన హస్తాంగత్యమునమావి
వనితపాదస్థితి వంజుళంబు
మృగరాజనిభమధ్య నగినఁబొన్న ప్రఫుల్ల
జలజాక్షి మోమీయఁ జంపకంబు
మానినీమణి (గీత) మాధుర్యమునఫల
చేడియగుబ్బలఁ జేర్పఁదరఁశి
కలికి తేనియలొల్కు పలుకుపల్కఁనగోఁగు
చెలువనిట్టూర్పుచే సిందుకంబు
వనజరాగోష్ఠి యుమియంగ వకుళశాఖి
తెఱవకనువిచ్చిచూచినఁ దిలకతరు వ

చేతనములయ్యెఁబుష్పవిభూతిఁదగ్స
చేతనులఁ బూరుషుల నింకఁ జెప్ప నేల॥ 19

తే॥ అపుడు తత్తత్కుజంబులనలరు నలరు
లలరుబోణులు(గోయంగ నచోటుఁ)బాసి
తెలివ దరి లేని సమ్మోహపరవశమునఁ
జెలులవిడనాడి యవ్వలఁ జేరనరిగి॥ 120

సీ॥ అండజధ్వజవహ్నికుండవిభ్రాంతినిఁ
గెందమ్మికోలఁకు వీక్షించిసుక్కి
కందర్పనిష్ఠుర ఖడ్గవిభ్రాంతిని
సహకారపల్లవచ్ఛటలకులికి
పంచాస్త్రకాహళార్భటులవిభ్రాంతినిఁ
గలికిచిల్కలపల్కు లాలయనళికి
దర్పక (తీవ్ర) కోదండవిభ్రాంతిని
శితగురుత్కల సముద్ధతికిసొలసి
వినుతసంకల్పజాస్థానవిభ్రమమునఁ
గుంజపుంజస్థలుల నిల్వఁగోర కెలమి
నతులితోత్కటపరితాప మతిశయిల్లఁ
జేయునది లేక యచ్చటఁ జిన్నవోయి॥ 121

వ॥ ఒక్కరోహిణీకాంతకాంత కాంతాసనాసీనయై తదూర్ధ్వభాగావృత లవలీలతావితానానూన వినిర్గతధారాళతుషారధారాశీకరపరంపరలు శంబరాసురాంతకజ్వరనివారణంబుగఁ బైఁబైఁజల్లుపన్నీరుగఁ భ్రాంత గంధగిరిబంధు గంధవహప్రేంఖీభూత రంభానోకహానేకాస్తోక పలాశంబులు వీచుచామరంబులుగఁ గలిగి యయత్నశిశిరకృత్యంబులు తదీయస్థలంబున సమకూరఁ గొంతతడవు విశ్రమింప నంతట నక్కాంత లక్కాంతంగానక యచ్చటచ్చటన్వెదకి యొక్కయెడం గూర్చున్న యానాతింగనుంగొని డాయనేతెంచి యిట్లనిరి.

ఉ॥ "అక్కటమమ్మ నొక్క క్షణమైనను బాయని దాన విప్పుడీ
వక్కరో! యొంటిరాఁదగునటమ్మ, తగన్ విరితేనెగాల్వలీ
దిక్కున లెక్కలేక మఱి తెంపున నేగతిదాటితమ్మ, హా
యెక్కడు పుష్పధూళి పథమెల్లనునిండిన దెట్లు పాదముల్
పొక్కఁగ నోర్చెనమ్మ చెలి! పోలునె సాహసమిట్లొనర్పఁగాన్"॥ 123

వ॥ అనిపలికి ప్రియవాక్యంబులన్ బుజ్జగించి మించుబోఁడిం దోడ్కొని, 124

క॥ వనకేళిభవాయాసము। వనకేళిం బాయునని యవారణమధులి
ద్వనరాజద్వనజాకర। వనశీకరమిళిత శీతవాతములొలయన్॥ 125

క॥ పాఱుచు సయ్యాటల నొ
ప్పారుచు లవలీలతాగృహాంతస్స్థలముల్
దూరుచు రానిలతాంగుల
దూఱుచు మొగములనునగవు తొలుకఁగ నంతన్॥ 126

క॥ ఆళీతతి నాళీకమ। ధూళీపరిమిళితపుష్పధూళీ మదహిం
దోళీ సుమరాళీ యుత। నాళీకారముగాంచి నందితలీలన్॥ 127

తే॥ "అబ్జచక్రాభ్యలంకృతంబగుచుఁదనరి
యతులిత కువలయామోదగతి నెసంగి
భువనములు లోన నొప్పారి పొలఁతులార!
కొలనుగనరమ్మ శ్రీహరిచెలువుఁదెలిపె॥ 128

వ॥ మఱియు నిప్పుండరీకాకరంబు కాంతారంబునుంబోలి విరాజమానపుండరీకంబై పుండరీకంబుకై వడి సదాభరితకువలయంబై కువలయబాంధవువై ఖరి నితాంతాంతరసమాకలితలలితశంబరంబై శంబరవైరిచెలువున ససముళిలీముఖప్రకాశమానంబై యొప్పెఁ జూడుండు॥ 129

సీ॥ త్రైలోక్యమాతయైతనరారు నమ్మహా
పద్మకుఁగౌతుకపద్మములివె

తోరంపుఁదలయేటిదారవ్రాఁటిమేటికిఁ
బాటిల్ల జయమిచ్చు బాణములివె
పలుకుతొయ్యలి నెలి నలుమోములొప్పు జే
జేపెద్దకును జన్మసీమలివియె
నీరు(పాల్విడఁదీయు) నేరుపుగన్న హం
సవతంసములకు భోజనములివియె
ఇవియెకనుఁగొనుఁడీమీర లింతులార!
పచ్చగుత్తాల నెఱరాతు కిచ్చమెచ్చు
వచ్చి కమలమ్ములనుబుట్టి వరలునట్టి
కమలములు, వీనిఁ గొనియాడఁగాఁ దరంబె॥ 130

మ॥ నిజజన్మాలయమౌ సరోజములకు న్మిత్రుండు మిత్రుండటం
చజహద్భానుసహస్రమిచ్చి తగ యాతాయాత గోషోడశం
బు జలేజారికొసంగెఁ దత్పరుఁడటం చుద్యత్కళాలీలఁ బ
ద్మజభాస్వద్రచనాచమత్కృతి తలంపం బక్షపాతంబుగా॥ 131

తే॥ పసిఁడితమ్ములుభుజియించి భారతీశు
తేజులై మిత్రుపేరిటఁ దేజరిల్లి
పాలునీ రేర్చఁగా నేర్పుచాలఁగలిగి
మించుహంసములివెసుండి మెలఁతలార!"॥ 132

వ॥ అని కాసారతీరంబునం జేరి కొనియాడుచుండ, 133

సీ॥ తనరారె నెఱులుగాఁ దనలోని చారుశై
వాలముల్ మత్త హిందోళములును
స్తనములగతిమీఱెఁ దనలోని చక్రవా
కకులమ్ములును బద్మముకుళములును
విలసిల్లెఁ గలికికన్నులలీలఁ దనలోని
యుత్పలమ్ములును నీలోత్పలములు
త(గెను) హాసశ్రీలఁ దనలోని దరవిభా
కాండముల్ ఫేనప్రకాండములును

ములను ద్రెంపుకొనుఁడని బ్రాహ్మణుల కుపదేశించి వారు తెంపకపోఁగానె ఓపు బేటీచోత్ బ్రాహ్మణులని నిందింతురు. ఆమఱునాడు మఱియొకసంస్కారిబయలువెడలి తమకుబిడ్డలులేకున్నను మఱియొకరికిబోధించి వారిబిడ్డను నొకచండాలునికిప్పించి మీమీబిడ్డలనందఱిని మాదిగలకిచ్చి పెండ్లిచేయుఁడని బ్రాహ్మణులకు బోధింతురు. వారదివినకున్న మాదర్చోత్ బ్రాహ్మణులు మాదిగలకుబిడ్డలనీయరని శపింతురు. వారికేమి! వారినాలుక వారిచిత్తానుసారము భాషించుచుండును. వారెట్లుతిట్టిన మనకేమి? ఈతిట్లకుమనము తగుదుమా తగమా యని విమర్శించుకొందము. వారు చెప్పినపనులు చేయనియెడ వారిశాపములు మనకుఁ దప్పవేని మన మాలోపములఁ బాపుకొందము-లేకున్న మీశాపములకు మేము పాత్రులముకామని విన్నవించుకొందము. శ్రీలింగముగారు భాంచోద్బ్రాహ్మణులు బాల్యవివాహములఁ గావించుచున్నారని మీరాసాయెబుగారివేషమునుబూని దూషించినను మనము చేయుచున్న పని మనబిడ్డలకు బాల్యవివాహములఁ జేయుటయని వారే నిరూపించియున్నారుకదా? ఇఁక మనము భాంచోదులమెట్లుకాఁగలము «భాంచోత్» అనఁగాఁ దోఁబుట్టువుతో సంగమముజేయువాఁడనునర్థము బాలురకుగూడ విశదమైనదే. ఆపనిజేయువారెవరు? మన మీరాసాయెబుగారే. మీరాసాయెబుగారు తోఁబుట్టువుతో సంగమముచేయువారనియెట్లునిరూపించెదరందురా? తనతోఁబుట్టువులకును బినతండ్రికూఁతురకును భేదము కలదా? లేదు-అటులేని బినతండ్రికూఁతుఁతో సంగమముఁజేయువారిని భాంచోదులని చెప్పఁదగునా? చెప్పఁదగును. అటులైన మన మీరాసాయెబుగారు పినతండ్రికుమారికను వివాహమాడెడి మహమ్మదీయసోదరుఁడే కదా. అగును కాని యీమీరాసాహెబుగారు నిజమైనసాహెబుగారు కారు. కాన మావిమర్శకులగు సాహెబులకు సంబంధింపదని ప్రాజ్ఞులు తెలిసికొందురుగాక. ఈమీరాసాహెబుగారు మఱెవరందురా? పూర్వాచారపరాయణులపైఁ దమకుగల కసిదీర్చుకొనుటకు రావుబహద్దర్ వారె కొంచెముకాలము మీరాసాయెబుగారివేషధారులై దూషించియున్నారు. కాని మనము సోదరీసంగమము చేసినట్లు శ్రీవారు తెలుపలేదు కాన మన మీదూషణకుఁ బాత్రులముకామని విన్నవించుచున్నాము. ఇఁక బేటీచోత్ మాదర్చోత్ అనుశాపములకును మనమర్హులముకామని విన్నవింపవలసియున్నది. బేటీచోదులనఁగాఁ గుమారికలఁగూడువాండ్రనియు, మాదర్చోదులన మాతృగమనముఁజేయువారనియు నర్థములు. వీనికి మనము లక్ష్యములముకాము. పదుగురు విధవలఁ బ్రోగుచేసికొని వారిచేఁ బగలు బాబయ్యలారయనియు రాత్రి బావయ్యలారయనియు మనము పిలిపించుకొందుమేని బేటీచోదులమును మన మా విధవలను బగలమ్మాయనిపిలిచి రాత్రి శయ్యకురమ్మాయని యాహ్వానముఁజేయుదుమే

ని మాదరోచ్ఛేదులమును నగుదుముకాని మన మాలాటిపనులఁజేసినవారముకాము. మనము చేసినపని బాల్యవివాహములఁ గావించుటయని వారే సెలవిచ్చియున్నారు. కాన నీశాపములకును మనము పాత్రులముకామని మనవిఁజేయనగును మనప్రతివాదులు మనలనియెన్ని దూషించినను రాజ్యకాంక్షచే జాతిధర్మనాశనమునకు నంగీకరింపఁజాలము. మానధనుఁడగువాఁ డెన్నటికైన పెద్దయుద్యోగమునుగోరి తనకులసతినిఁ బరపురుషునికడకంపఁడు కదా. ఇట్లనిన జాతివిభాగముగలమనము రాజ్యవిహీనులమును, నదిలేనిపరదేశీయులు రాజ్యయుతులుగను, నుండఁ లేదా? ఇఁక జాతివిభాగమువలన మీకుఁగలిగిన యాధిక్యమేమని కొందఱడుగుచున్నారు. అదినిశ్చయమే. రాజ్యకాంక్షచే దీనినంగీకరించిన వెంటనే మఱియొకసంస్కారిగారు వెడలి గోమాంసభక్షణమును, బితృవ్యసుతాపరిణయమును, లేని మనము రాజ్యవిహీనులమైయున్నవారము. అవికల పరదేశీయులు స్వరాజ్యసుఖమనుభవించుచున్నారు. మీయాధిక్యమేమనియడుగుదురేమోయనుభయము మము బాధించుచున్నది. పూర్వాచారపరాయణులు తమ జాత్యాశ్రమధర్మనిర్మూలనపూర్వకముగావచ్చెడి యింద్రపదవినిఁగూడఁ దృణీకరించెడివారుకాన మనసోదరు లెంతదూషించిన నంత మొండిఁజఱచి యెదురీఁదుటచే మనసంస్కారులకోరిక లీరికలెత్తి యీడేఱకపోవుటకని కినిసి యిఁక దండోపాయమునఁగాని పూర్వాచార పరాయణులుచక్కఁబడరని యోజించి "రజస్వలావివాహశాసన" మను చంద్రహాసమునకు నబాధకము నైచ్ఛికము నను రెండుపదునులనుదొడిగి జళిపించి దానితోఁ బూర్వాచారపరాయణులను జక్కడఁటకై యేలినవారియానతినిఁ గోరుచున్నవారు.

♦ రజస్వలావివాహశాసన మబాధకము నైచ్ఛికము నగునా? ♦

కాదని యిదివఱకాంధ్రదినపత్రిక **2-2-15** తేదిగల సంచికయందు మాలో శివపురపు వీరభద్రపాకయాజివ్రాసినవ్యాసమునుండి ప్రకృతానుకూలముగు భాగమునుసంస్కరించి యిందుఁ జేర్చుచున్నారము.

ఈశాసనము రజస్వలావివాహములఁ గావించుకొన నిష్టములేని పూర్వాచారపరాయణుల బాధింపక తదాచారప్రవిష్టులగు సంఘసంస్కారులకు దాయభాగమిప్పించుటయందుమాత్రమే ప్రవృత్తికలిగియున్నదికాన నీశాసన మబాధకము నైచ్ఛికము నగుచున్నదని యొకవింతబోధకుదిగియున్నవారు. తృణావృతకూపసన్నిభమగు నీశాసనమునఁ బూర్వాచారపరాయణులను మోసముచేఁ బడఁద్రోయుటకై యైచ్ఛికము నబాధకము నని చెప్పఁదొడంగిరికాని యిది యైచ్ఛికముకానట్టినిర్బంధశాసనమే యగుచున్నది. ఎట్లనః—

ఈశాసనము నాధారముఁ జేసికొని రజస్వలలైనవారిని వివాహమాడవలసినవారు పూర్వాచారపరాయణుల పుత్రులు గాక సంస్కారులను మఱియొక తెగవారు మనదేశమునఁ గలరా? లేరు. లేనిచో నీశాసనము పూర్వాచారపరాయణుల నేల బాధింపదు? తండ్రి పూర్వాచారపరాయణుఁడును బుత్త్రుఁడు నవీనాచారపరుఁడును నగుదురేనిఁ బరస్పరము కలహించి పితృపుత్త్రప్రేమానుబంధవిచ్ఛేదముఁ గావింపుకొనరా? ఈహానికి మూలకారణము శాసనముగ నుండుట లేదా? ఈవిషయము సుబోధకముగుటకై యొకటిదృష్టాంతరూపమున విన్నవించెదను. వినుఁడు. పూర్వాచారపరాయణుఁడగు దేవదత్తుఁడను బ్రాహ్మణునకు స్వధర్మానుయాయియుఁ బరబోధానుసారియు నను నిరువురు పుత్త్రులు కలరను కొందము-వారిలోఁ బరబోధానుసారి పరబోధానుసారియై స్వధర్మశాస్త్రాచారవిరుద్ధమగు రజస్వలావివాహముఁ గావించుకొన యత్నించెనని తలంచుదము. అపుడు వానితండ్రియగు దేవదత్తుఁడును, నాతని బంధువులును, నిదివఱకున్న తమశాస్త్రాచారముల ననుసరించి దాయభాగమీయమని బెదరించి స్వమతాచారభ్రష్టుఁడు గాకుండఁ గాపాడుకొనుటకును, లేనిచోఁ దమసొత్తును స్వధర్మానుయాయికిఁ జెందఁజేయుటకును, సర్వస్వాతంత్ర్యములు గలిగియున్నవారు. వాదమునిమిత్త మిపుడీ యైచ్ఛికమనఁబడు రజస్వలావివాహశాసన మురరీకృతమైనదని యెంచుదము అపుడు దేవదత్తుఁడు తనమతాచారవిరుద్ధప్రవర్తకుఁడగు పరబోధానుసారియను పుత్త్రుని స్వాధీనముఁ జేసికొనుట కుపాయ మేది? నీకు దాయభాగమీయనని చెప్పవలయునా? చెప్పిన నాబాలుఁడే యుపేక్షింపఁడు. ఒకవేళ నాబాలుఁడూరకుండినను మనసంఘసంస్కారసోదరులు నిజకరవిభాసితరజస్వలావివాహశాసనచంద్రహాసధారాహతి రుచిఁ జూపుటకై యాబాలుని బురికొలిపి యప్పిచ్చి వెంటనే వ్యాజ్యము "దాఖల్" చేయింపక విడుతురని మనము విశ్వసింపఁదగునా? తగదు. అత్తఱి న్యాయాధిపతులు సంఘసంస్కారపక్షములోనివారలైనఁ జెప్పవలసిన దేమియు లేదు. అట్లు కాక, యాన్యాయాధిపులు పూర్వాచారపరాయణులైనను లేక యితరమతస్థులైనను నీశాసనమును బురస్కరించుకొని యుంగరాలపిడికిటితో మన దేవదత్తుని నెత్తిమీద మొత్తి పరబోధానుసారికి దాయభాగమునిప్పింపక విడుతురా? విడువరు. విడువనిచో నీశాసనప్రసాదమువలన మనసంఘమునఁ బ్రతియింటను గుటుంబకలహము లుత్పన్నములై పితృపుత్త్రప్రేమానుబంధవిచ్ఛేదములఁ గావించి సంఘమును క్షీణింపఁజేయవా? చేయును. ఆ క్షైణ్యమునకుఁ గారణ మీశాసనము గుట లేదా? అగుచున్నది. స్వధర్మబోధయెట్టిదో లేక యుగ్గుపాలుపానముఁ జేసెడినాఁటనుండి "డాగ్గులను, పిగ్గులను" గూర్చి నే

ర్చుకొని తదాచారప్రవర్తకులగుచున్న మనబాలురను నైచ్ఛికపదత్రాణావృతమైన రజస్వలావివాహవిషకూపమున నీశాసనహస్తముతోఁ బడఁద్రోయుటకు యత్నించుచున్నవారని మనము చెప్పుటకు సందియముకలదా? లేదు లేదు; ఈయభిప్రాయమునే బలపఱచుచు మనమతాచారవిషయములందుఁ బ్రభుత్వమువారిని శాసనము లేర్పఱచుఁడనికోరుటవలన నాత్మగౌరవహానికలుగును గాన నీప్రయత్న మనుచితమని పూర్వాచారపరాయణులగు శ్రీ సి. పి. సుబ్రహ్మణ్యయ్యర్ బి. ఎ. గారును దేవర కొండజగన్నాథరావు బి. ఎ. గారును, మున్నగు నుభయభాషాపండితులును, వీరివలెనే సంఘసంస్కారప్రియాగ్రగణ్యులైన "అమృతబజార్, హిందూ, పత్రికాధిపులును, డాక్టర్ భాండార్కర్ మొదలగువారును నుడివియున్నారు. కాని యీసంస్కర్తలు శాసన మనవసరమని వాదించినను రజస్వలావివాహములను గోరెడివారలె.

* రజస్వలావివాహములను గోరెడి సంస్కర్త లెన్నితరగతులుగానున్నారు?. *

వారిబోధలవలనఁగలిగెడి నష్టము లేమి? యని కొందఱుప్రశ్నించుచున్నారు. కాన వారిప్రశ్నలకుఁ బ్రత్యుత్తరరూపమున నీవిషయమునుగూడ నించుక యుపక్రమించుచున్నవారము. ఇపుడుమనసంఘము నుద్ధరించుటకై పలువురుసాంఘికులు బయలుదేఱియున్నవారు. వారిలో ముఖ్యులు, (1) బ్రహ్మసామాజికులు (2) ఆర్యసామాజికులు (3) సంఘసంస్కారులు (4) సంఘసంస్కారప్రియపండితులను స్వదేశీయసోదరులును, బెసెంటమ్మగారు, బిసెంటమ్మగారు వను బరదేశీయసోదరులును నని మన మనుకొనవచ్చును. ఇందుఁ బరదేశీయసోదరు లెంతవక్తలైనను వా రెంతఘనపండితులైనను మనధర్మములఁ దెలిసికొని మన కుపదేశించుటకుఁదగినయధికారము వారుపొందుటకుఁ గొన్నియుగములుగడచిన వెనుకగూడ సిద్ధించునో సిద్ధింపదో యని సందియ మందవలసియున్నది. కాన వారిబోధలవలన మనసంఘమునకుఁగలిగెడికీడుగూడ నంతపాటిది గాదె యుండునని మనము చెప్పుకొనవచ్చును. ఇఁక స్వదేశీయులగుఱించి క్రమముగా ముచ్చటించుచున్నారము.

(1) బ్రహ్మసామాజికులు. వీరు మనమతమునకు ముఖ్యములైన జుట్టు బొట్టు కట్టులను దుడిచిపెట్టుకొని ప్రచ్ఛన్నక్రైస్తవమనఁదగు బ్రహ్మమతము నవలంబించి కేవలము తమయిష్టములనె ప్రధానముగాఁబెట్టుకొని శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసాదిప్రమాణగ్రంథములకు గర్భశత్రువులై ప్రవర్తించుచున్నవారు. వీరివలలో లోకమతజ్ఞానశూన్యులగు బాలురుకొందఱు చిక్కుకొనినను క్రమముగా వారికి లోకమతజ్ఞానములలవడినకొలఁదిని నందలిసత్యమును దెలిసికొని వారు వారినుండి విడివడుచున్నారు. ఇందులకుఁ బెక్కుదృష్టాంతములుకలవు. పూర్ణముగా మతత్యాగము గావించిన బ్రహ్మసామాజికుల యుపదేశములు మనసంఘమున కంతయరిష్టమును గలిగింపఁజాలవు. కాని యాబాలురయుపకారముకొఱకు వారివాదము నిరసించుట మనకుఁదప్పనిపని.

(2) ఆర్యసామాజికులు. వీరు పైవారివలె బొట్టుకట్టులను దుడిచిపెట్టినను జుట్టునుమాత్రము బట్టుకొని యన్నిప్రమాణగ్రంథములందుఁగూడ వేదములను, మనుస్మృతిని, మాత్రము ప్రమాణముగాఁగ్రహించితిమని చెప్పి వాని కర్థము లించుమించుగా బ్రహ్మసామాజికులు చెప్పినవానినె యనుకరించియున్నవారు. వీరిబోధలు పైవారిబోధలవలెగాక మనవేదశాస్త్రములను బ్రమాణములుగాఁబెట్టుకొనియుండుటచే నవిజనసామాన్యమును గొంతవఱకుఁ దమవాతవేసికొనకమానవు. కాన వీరివాదముగూడ ఖండింపవలసినయవసరము మనకుఁగలదు.

(3) సంఘసంస్కారులు. వీరు పైవారివలె జుట్టు బొట్టు కట్టులను బూర్ణముగఁదీసివేయక మనలోనుండియె కొన్నిమార్పులుకోరువారుగనున్నవారు. వారుకోరినవియంతగొప్పవిషయములుకావంట! కొంచెము జాతిభేదములనుదీసివేసికొని, యంతయెక్కువ సంగతికాదు, కాని మనబిడ్డలనుమాత్రము మాదిగలకిచ్చి మాదిగలబిడ్డలను మనము పెండ్లిండ్లుచేసికొనెడి సంస్కరణమును బూర్వాచారపరాయణు లంగీకరించి, చిన్నవిషయము, పరదేశమ్మునకు మనసోదరులుపోయినపుడు వారికచట మన పూటకూలి, సత్రములు, ల

భింపవుకానఁ దెల్లవారి "హోటల్సు"లోఁ గొంచెము మద్యపానముజేసి మఱికొంచెము మాంసాహారముఁదిని స్వదేశాభివృద్ధికై యింతశ్రమపడి వ్యాసప్రయాసములనుగూడ లక్ష్యపెట్టక "బారిస్టరట్లాలు" ప్యాసైవచ్చినవారినిఁ బ్రాయశ్చిత్తము, గీయశ్చిత్తము తేకుండగా వారికెదురుగాఁబోయి కాశీయాత్రావాసముఁజేసివచ్చినవారినిఁ బూజించినట్లు పూజింపకపోయినను వారిపాదములను మాత్రముగడిగి యాపవిత్రజలమును గొంచెము నెత్తిమీఁదఁజల్లుకొని యూనాఁడు బంధుమిత్రులను విందునకుఁబిలుచుకొని సంక్రమణాపర్వముచేసికొనినఁ జాలునుగాని దీనితో నిఁకనొకటిఁజెప్పవలసియున్నది. అదేమన? పునరుద్వాహముఁ గావించుకొనిన విధవలనుమనయిండ్లలోజరుగు పెండ్లిండ్లలోవచ్చినవారికందఱి కింత తీర్థప్రసాదములుఁ జక్కఁగావడ్డించెడియధికారమునొసంగియుఁక మిగిలినదొక్కటియేకనుక రజస్వలానంతరమున మనకన్యలు తమకుఁదామె వరనిర్ణయముఁగావించుకొనిస్వయంవరవివాహములఁ జేసికొనవచ్చునని యీమాత్రపుసంస్కరణమును బూర్వాచారపరాయణులొప్పుకొన్న మనము కోటలోఁ బాగావేయమా?వీరితల్లికడుపుకాల; యొప్పరు. తరువాత నిమ్నజాత్యుద్ధరణమా యనంతటఁదానే వర్ధిల్లఁగలదు. ఇఁకబోగము మేళముల మానుపించెడి మాట యేమని యాడిగెదరా? అంత పుణ్యముఁ బుట్టి పూర్వాచార పరాయణులు మనము పూనిన యీ సంస్కారములనన్నిటి నంగీకరించినఁజాలును. అప్పుడుబోగముసానులెవరో? కులాంగనలెవరో? తెలిసికొనుట కెవరితరము! అని యీచిన్నసంస్కారవిషయములు మనసంఘసంస్కారులు కోరుచున్నవారలు. కాని వీరికోరికలుతీరుటకు చిక్కులుపెక్కులుగలవు. అవేమన, మనపూర్వాచారపరాయణపండితులు చర్చవచ్చినప్పుడు శాస్త్రము లంగీకరింపనివిషయములు దామంగీకరింపకపోవుట, దానికి మనసోదరులు శాస్త్రములతో సమాధానముల నీయవలసివచ్చుట, తటస్థించును, అపుడు మనసంస్కారప్రియసోదరు లాశాస్త్రగ్రంథము లెట్లుండునో యవి యేదేశములోఁజిక్కునో చిక్కినను వానినెట్లుచదువవలయునో చదివినను దాముతలఁచినవిషయములకు వలసినవచనములేవో యావచనము లకర్థములేమో తాముచేయందలంచినసంస్కారములకు శాస్త్రములనుబట్టి యేనామముఁబెట్టుకొనవలయునో? యేమియు నెఱుఁగరు. ఈచిక్కులు వారి నెక్కువబాధించుచున్నవను

విషయము, మనలోఁ జాలమందికిఁ దెలియును గాన, వారిబోధమనలోఁ జొరఁజాలదు. కాని వెనుకటివారివలె వీరు మనమండివిడిపోక లోపలనున్నవారు కాన గర్భములోని పుండ్లవలె మనబాలురను బాధించుచుందురు, కానమనబాలురపాలిటి యీబాలగ్రహముల వాదములఖండించుటయు మనకువిధియైయున్నది. వీరివాదమువిశేషముగాయుక్తివాదమును ఖండించునట్లు నిరసించియున్నవారము. అటఁజూడఁగలరు.

(4) సంఘసంస్కారప్రియపండితులు. వీరు స్వభాషాకోవిదులు. వీరిలోఁగొందఱుసంఘసంస్కారాధీనజీవనోపాధులై పంజరములలోఁ జిక్కిన చిలుకలవలె సంస్కారులు చెప్పినపలుకులనెల్లఁ దమమృదుమధురవచనముల ననువదించుచుందురు. కాన నీస్వభాషాపండితోపదేశములవలన మనమతాచారముల కెక్కువహానికలుగుననుటకు సంశయములేదు. ఈపండితప్రభావమే మన యీయాంధ్రప్రపంచమునంతను గలవరపఱచి యీయల్లాతలూగించినది. వీరిచేయూఁత నాధారముచేసికొనియే మనసంఘసంస్కర్తలు రజస్వలావివాహములు శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసానుభవయుక్తిహేతుచరిత్రానుకూలములుకాన వీనిని మాసంఘమునవ్యాపింపఁజేయుటకు ననువగు రజస్వలావివాహశాసనమునుస్థాపించుఁడని దొరతనమువారిని వేడుచున్నారు. కాన వారిశీర్షిక మొదలుకొని క్రమముగా వారుచెప్పినవిషయములన్నియు విమర్శించెదము. కాన సనాతనధర్మనిరతులిందలి సత్యసారమునుగ్రహింతురుగాత. రజస్వలావివాహమనుశీర్షికను విమర్శించుటకు ముందు నీవిషయమునుగోరెడుమనసోదరులు తమ్ము "సంఘసంస్కారులు" అనివాడుకొనుచున్నారు. కాన ముందీనామముఁగూర్చి విమర్శించెదము.

## ♦ సంఘసంస్కారులనఁదగుదురా? ♦

సంఘసంస్కారులనఁగా సంఘమును సంస్కరించువారనియర్థము. సంస్కరించుటయనఁగాఁ బాగుజేయుటయనిభావము, ఇదివఱకున్నపదార్థమున కేదేని లోపముకలిగినపుడు దానినిఁబాపి చక్కఁజేయుట సంస్కారమగును గాని నూతనపదార్థనిర్మాణమునకు సంస్కారనామము చెల్లదు. క్రొత్తదానిని నెలకొల్పుటకు సంస్థాపనమనవలెఁగాని సంస్కారమనిచెప్పరాదు. మనసోదరులిదివఱకు మనసంఘమున నెన్నఁడును లేని యేకజాతి(వర్ణ) సాంకర్యము రజస్వలావివాహము, వితంతూద్వాహము, విదేశగమనము,

లోనగు శాస్త్రాచారనిషిద్ధ కార్యసంస్థాపనమునకు సంస్కారమనుపేరిడి దానిని దాము గావించుటచే సంస్కారులమైతిమని వాకొనుచున్నారు. వారుచెప్పెడికార్యములు మన సంఘమునకు నవీనములుకాన వానిని స్థాపింపవలెననెడి యాసక్తి మనసోదరులకు విశేషముగానుండుటచే వీరు నవీనాచారపరాయణు లనిపించుకొనఁదగుదురుకాని సంస్కారనామముచే వ్యవహరింపఁదగరు. తగనివారైనను లోకసిద్ధినిబట్టి యిదివఱకున్న నామములనె యిందువాడుచున్నారము.

## * ప్రౌఢావివాహమునఁదగునా? *

ప్రౌఢయనన ముప్పదియేండ్లపైన నేఁబదియైదేండ్లలోపలనున్న స్త్రీయని యర్థము. ఈయర్థమును శంకరనారాయణనిఘంటువు దృఢపఱచుచున్నది. చూడుఁడు 562 పుట ప్రౌఢ=A married woman from 30 to 55 years of age, బ్రౌన్యనిఘంటువు 728 పుట ప్రౌఢ=A woman 30 years of age to 55,, శబ్దార్థకల్పతరువు, త్రింశద్వర్షాదారభ్యఆపంచపంచాశద్వర్ష స్త్రీయాం, ఈయర్థములంబట్టి ప్రౌఢకు వివాహముఁజేయవలయునేని ముప్పదియేండ్లమీఁదఁజేయవలయునని తేలుచున్నది. మనసోదరులు మనుస్మృతిలోని "త్రీణివర్షాణ్యుదీక్షేత,, యనుశ్లోకమునుగ్రహించి ప్రతికన్యయు సమర్తాడి మూడుసంవత్సరములు నిరీక్షించి పిదప స్వయంవరవివాహమునుజేసికొనవలయునని వాదించుచున్నారు. పండ్రెండేండ్లకుసమర్తాడినపడుచు మూడువత్సరములునిరీక్షించి పదునేనుసంవత్సరములువచ్చినతరువాత వివాహముఁజేసికొనవలెనని వారివాదసారమైయున్నది. మన త్రిలింగపత్రికాధిపతులుచెప్పిన ప్రౌఢావివాహమునుపదమువలనఁ బండ్రెండేండ్లకు రజోవతియైనకన్య పదునెనిమిదిసంవత్సరములునిరీక్షించి పరిణయముఁగావించుకొనవలెనని యవగతమగుచున్నది. ఇదియెట్లుపొసఁగును? రజస్వలావివాహములను గావించుకొనెడిసంఘములందుఁగూడ నీయాచారమున్నట్లు కానరాదు. కానఁబ్రౌఢావివాహమునుపదము సాధువనివ్రాయుట శాస్త్రాచారానుభవవిరుద్ధమని విశదమైనది.

## • తరుణీవివాహమునఁదగునా? •

తరుణీయువతీశబ్దములురెండునుసమానార్థకములని యమరమునఁ

శ్రీమహాగణాధిపతయేనమః

# వర్ణాశ్రమధర్మరక్షణసభ, గుంటూరు.

(శ్రీమల్లాది రామకృష్ణవిద్వత్సోమయాజిగారిచే వ్రాయబడినది.)

శ్లో॥ షడ్భి రంగై రుపేతాయ వివిధై రవ్యయై రపి ।
శాశ్వతాయ నమస్కుర్మో వేదాయ చ భవాయ చ॥

శ్లో॥ ధర్మరక్షైకదీక్షాయ లోకానా మార్తిహారిణే ।
మాయాధిష్ఠానచిన్మాత్రవపుషే హరయే నమః॥

శ్లో॥ సర్వతంత్రస్వతంత్రా యే గురవో బ్రహ్మవిత్తమాః ।
తాం త్సుందరేశత్యాగేశ బాలకృష్ణాభిధాన్నుమః॥

నిజము గురుతెఱింగి ప్రవర్తింపఁదలఁచిన యార్యమహాజనులకు సవినయముగఁ జేయు చిన్ని విన్నపము:—సర్వశక్తులు గలిగిన సర్వజ్ఞుఁడగు పరమేశ్వరునిచే సృజింపఁబడిన యీబ్రహ్మాండంబున భూలోకంబు నానావిధఖండమండితంబై నరపశుమృగాది నానావిధప్రాణిజాతంబున కాశ్రయంబై విలసిల్లుచున్నయది. దీనిలోనియీభరతఖండము బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రానులోమ ప్రతిలోమ సంకరాదిజాతిభేదంబులచే తనుసబ్రహ్మచారి,గృహస్థ,వానప్రస్థసన్న్యాసాద్యాశ్రమధర్మంబులచేతను వర్తిల్లెడి జనులతోఁ బరిపూర్ణంబైయున్నది. ప్రపంచంబున నిన్నిఖండంబులలో జనులు జాతిభేదంబులు లేకయే వర్తించుచుండగా నీభరతఖండంబున మాత్ర మీభేదముండ నేలయని కొందఱు నవనాగరకు లీభేదంబుల రూపుమాపుటకై యత్నించుచున్నవారలు. వీరి యుద్దేశము లేమాత్రము సరియగునవి గావు. చెట్లులలోన చూత పనస చంపక పున్నాగాది జాతిభేదంబులుగలవు. ఓషధులలో నానావిధ వ్రీహి,యవ,గోధూమాది జాతిభేదంబులుగలవు. పశువులలోనఁబక్షులలోన నిట్టిభేదంబులు వేనవేలు గలవు. ఇటులనే మనుజులలోనను బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది నానావిధ జాతిభేదంబు లుండనోపును. సృష్టి జీవుల కర్మోపభోగము కొఱకు జరుగును. కర్మంబులు పలువిధంబులుగాన నాయాకర్మానుభవంబునకై యాయావాసనానుసారముగా బ్రాహ్మణాది భిన్నజాతులంగు జన్మంబులు రావచ్చును.

వృక్షములలోని జాతిభేదంబు లాకారభేదంబులచే బ్రత్యక్షము లగుచున్నవి. మనుజులలో నాకారభేదంబులు గానరావుగాన వీరిలో వర్ణభేదంబులు లేవని కొందఱు శంకింతురు. ఆకారభేదంబులంబట్టి జాతిభే

దంబుల పరికింపవచ్చును. గుణభేదంబులంబట్టియుఁ బరికింపవచ్చును. బ్రాహ్మణులందు శమదమాదిగుణంబులును, క్షత్రియులందు శౌర్యాధైర్యాదులును, వైశ్యులందు వాణిజ్యచాతుర్యాదికమును, శూద్రులందు ద్విజశుశ్రూషయును, సంకరులందాయాధర్మంబులును బ్రాయికముగాఁ జూపట్టుచున్నయవి. విచిత్రకర్మశక్తుల వలన వీరిలో గుణసాంకర్యము గలిగినను తరుచుగా నీగుణములకు మార్పుగలుగదు. మంచియిత్తడికిని బంగారమునకు జర్మనిసిల్వరుకును వెండికిని రాతిముత్తియములకును మంచిముత్తియములకును గల జాతిభేదము పామరులకుఁ బరికింప నశక్యంబైనను ఆయా వస్తుస్వభావపరిశీలురు గురుతెఱుంగునట్లు మనుజులలోన బ్రాహ్మణక్షత్రియాదిభేదంబుల మనము గురుతెఱుంగజాలకపోయినను సర్వజ్ఞులగుచు పరమార్థమునకై మానవదాయదాయము వ్యయపుచ్చిన మహాత్ములు గురుతెఱిఁగి విభాగముల నాచరించియుండిరి. మనకు గోచరముగాని మాత్రమున నీవిభాగము న్యాయ్యముకాదనుట సమాజసముకాదు. మనకు పరిచితముగాని లిపిని జూచి యర్థములేని పిచ్చిగీతలని వాదింతుమేని మనము బుద్ధిశాలులలో లెక్కింపఁబడుదుమా? లెక్కింపఁ బడఁజాలము. చేదుబీరకాయలకును మంచిబీరకాయలకును గల భేదము నాలుకకుదక్క నితరేంద్రియములకుఁ దెలియకపోయినను భేదములేకుండునా? అటులనే మనుజులలో బ్రాహ్మణక్షత్రియాది భేదంబులు బాహ్యదృష్టిగల మనబోంట్లకుఁ దెలియకపోయినంతమాత్రమున నాభేదంబులు లేవనిగాని, యుండఁగూడదని గాని తలంచుటతప్పు. గరుత్మంతుండు దనతండ్రియగు కశ్యపప్రజాపతియాజ్ఞఁగొని మహేంద్రునిజయించి యమృతమునుదెచ్చి తనసవతితల్లికుమారులగు కాద్రవేయుల కిచ్చి తనతల్లికి పందెమువలనపూర్వము ఘటించిన సపత్నీదాసీత్వమును మాన్పింపఁదలఁచి యేగునప్పుడు తనతండ్రిని నాకు మార్గమధ్యంబుననాహారముబెట్టుమని యడుగగా నాయన గజకచ్ఛపంబులను మ్లేచ్ఛసంఘంబును ఆహారంబుగా నొసంగెను. ఆమ్లేచ్ఛసంఘమును భుజించునప్పుడాసంఘములో మ్లేచ్ఛస్త్రీసంగమముచేపతితుఁడగు నొక్కబ్రాహ్మణుఁడును జేరియుండెను. ఆయన గరుత్మంతునికంఠముగాల్చెను. అప్పుడా గరుత్మంతుండా బ్రాహ్మణబ్రువుని భక్షింపక వదలిపెట్టెనని యొక కథ మహాభారతంబున వర్ణింపఁబడి యున్నయది. శ్లో॥ "విప్రంపురాపతగరాడివ నిర్జగార" యని మాఘకవియు నిక్కథనుదాహరించె. దా

చ॥ విడిఁబడియేవొపద్యముల వేవచియించుచపాండితీప్రభ౯
గడబిడపెట్టు సత్యవిముఖప్రజపొంతకు నేగఁగాని పే
ర్వడసి సుపర్వభాష ఋతవర్తనగల్గినవిజ్ఞకోటి కే
నడుగులనొత్తుచుంట జననాదిగనున్నదె, యేలవిస్మృతి౯॥

ఉ॥ ఎన్నొదినాలనుండియును నేనిటు తిర్పతివెంకటేశుల౯
సన్నుతిచేయుచుండఁగను శాఖకు గౌరవము౯ గడించుకో
నున్నయశస్వులెల్లరును యోజనచేసి మదుత్తమాంగమం
దున్నిలకొల్పరొక్కముగఁ దోఁచినలాగపవాద మెన్నియే౯॥

ఉత్సాహము॥ తేనెఁబోసికలిపినట్టి తెల్లబియ్యపన్నము౯
మానకారగించినట్లు మంచిమీప్రబంధముల్
పూనిచదువునప్పుడుండుఁబో కవీంద్ర! యేరికి౯
నే నిఁకేమినుతియొనర్ప నేర్తు౯ మీడుకైతము౯॥ 5

కం॥ అవతారపురుషులీరని।కవివర! నాకాశయంబుగల, ందున నే
భవదీయ నామమెపుడు౯ । శివనామమువలె బ్రసంశ చేయుచునుండు౯। 6

ఆ॥ ఇంచుకైన మీరలిడినజవాబు నా।తోడ శౌరి మాటలాడు టరయ
భాగ్యమునలభించు భగవత్ప్రసాదంబు। కరుణమీరలను ప్రగ్రంధసమితి॥ 7

తే॥ భగవదవతారములఁదేనఁ బ్రజ లనూయ।పడకయున్నాగ లట్లె మీపయిననూయ
పడుచునుందురు మూర్ఖులిప్పట్లు। దాన నేమికాఁబోవుచున్నది యీరలకును॥ 8

కం॥తిరుపతిశాస్త్రిలవారికి। మఱివెంకటరామకవికి మరలనిప్రుడు వా 9
గ్వైరసత యేర్పడుటం జే।పరులం పరియించుచుంటి బహుళంబుగ నే॥

ఉ॥ కావున వీరికిర్వురకుఁ కల్గినయట్టి వచోవివాదము
నీమ్రవలన౯ సకృత్సుముగ నేవిని పేపరున౯ లిఖింపఁగ౯
భావముగల్గియున్నయది, పంపుఁడనుగ్రహముంచియీ క్రమం
బోవిబుధాగ్రగణ్య! యదెయొక్క ప్రబంధము గాగ్రహించెద౯॥ 10

కం॥ సిగ్గిలక సుకవిరాజుల।దగ్గరకైనంగరంబు తార్మాణుగ నా
పగ్గబయల్పడవ్రాసితి। నెగ్గుగమదినెంచువార లీరలుగామి౯॥ 11

జా॥ పట్టాభిరామశాస్త్రి.

ఉ॥ నైల్యముమోపియీవిధిని నన్ జెడఁదిట్టెడివారిబోధలన్
బాల్యమునుండిమిత్రులయి భాసిలుచుండినవారుసైతము
న్లౌల్యముఁబూని నేఁ బ్రమరణంబొనరించెడి పేప"రొల్ల"మన్
కల్యనుకూలలేఖల నెకాయెకిఁబంపి రిఁ కేమిచెప్పుదున్॥

క॥ పులిపాకపూర్ణయాఖ్యుఁడు
తొలుతం బత్రికకుఁ జాలఁదోడ్పడి పదిము
ద్రలనొసఁగుచుండియుం ముద
"నిలుపుఁడు పంపక" యటంచు నేర్పునవ్రాసెన్।

---

Narasaraopeta
**2-10-11**

అయ్యా!

ఇప్పటినుంచి తమఅభినవసరస్వతికి చందాదారుగా వుండుటకు కొన్నియిబ్బందులవలన వీలుకలుగలేదు-కనుక పేరుతీసి వేయవలెను.

చిత్తగించవలెను.
రూ॥ హనుమంతరావు.

Narasaraopeta
**2-10-11**

అయ్యా!

ఇప్పటినుంచి తమయభినవసరస్వతికి చందాదారుగానుండుటకు కొన్నియిబ్బందులవలన వీలుకలుగలేదుగాన పేరుతీసివేయించవలెను.

చిత్తగించవలెను.
బెల్లంకొండ రామచంద్రరావువ్రాలు

Dear friend,

Narasaraopeta.
**2-10-11**

ఇప్పటిసందర్భములనుబట్టి నేను మీయభినవసరస్వతికి పోషకుడుగానుండుటకు వీలుపడదు కాబట్టి దయచేసి నా పేరును తీసివేయించకోరినాను- నేను చందాదారుగానైననుండుట కిష్టపడను-కావుననీసంగతితెలియపరుచుచున్నాను-ఇంతేనమస్కారములు,

చిత్తగించవలెను,
వి॥ పులిపాక పూర్ణయ్యవ్రాలు.

ప.రా:—ఇత్యాదులనేకములు.

క॥ పూర్ణయ్యగారిచరిత ము। దీర్ణప్రాభవముగలిగి దిగ్గజయానా
కర్ణావతంసమైనది। వర్ణింపఁగఁదగిన దతనివర్తన యరయన్॥

సీ॥ భూసురుఁబొడఁగన్న బుచ్చునే యతఁడొక్క-
యహమైని తనపంక్తి నన్నమిడక
విద్వాంసుఁబొడఁగన్న విడుచునే యతఁడొక్క-
నెలయేని తనయింట నిలుపుకొనక
యాచకుఁబొడఁగన్న ననుపునే యతఁడొక్క-
మాసంపుబత్తెమేఁ జేసియీక
ఆర్తునిఁబొడఁగన్న నరుగునే యతఁడొక్క-
యడుగేని యాతని నరసికొనక
అన్నదాత విద్వదాదృతిశీలుండు
అర్థికల్పశాఖి యార్తిహరుఁడు
పూర్ణయాభిధానుఁ బుడమి నేతన్మాత్రుఁ
డనుచుఁజెప్ప నెవరికానుఁ నోరు॥

---

31st Day of August 1911 .. జానపాటి పట్టాభిరామశాస్త్రి-వాది.

ఈదావాలో నేను వాదిని మాగ్రామములో పోలేరమ్మ పాతపాటమ్మ గుడులువున్నవి. యీగుడులు యిదివరకు బ్రాహ్మణప్రతిష్టఅయివుంటే గ్రామంలో పెద్దకాపు మునసబు బ్రాహ్మణులనుసరిపడక వారికి అవమానముకలుగచేయవలెనని ప్రతివాదులచే ప్రతిష్టచేయించినారు. కంసాలులుప్రతిష్టచేసినగుడులలోకి బ్రాహ్మణులు పూజచేయుటకు వెళ్లరు. నిర్ణయసింధులో*బ్రాహ్మణేతరులుప్రతిష్టచేసినగుడులలో బ్రాహ్మణులు పూజచేయగూడదని చెప్పబడివున్నది. కంసాలీలయిండ్లలో తక్కువజాతులవారు భోజనముచేయరు. యీప్రోలేలమ్మ పాతపాటమ్మదేవాలయములలోకి కంసాలీలు ఎప్పుడు పూజకురాలేదు. ప్రతివాదులుప్రతిష్టచేయుటకుముందు 2,8 యేండ్లక్రింద బ్రాహ్మణులు దావాగుళ్లలో ప్రతిష్టచేసినారు. బంగారపుపనిచేసేవారిని వడ్రంగంపనిచేసేవారినికమ్మ

---

* నిర్ణయసింధువు 192 వ పేజీ.

శ్లో॥ యశ్శూద్రసంస్కృతంలింగంవిష్ణుంవాపినమేన్నరః
ఇహైవాత్యంతదుఃఖానిపశ్యత్యాముష్మికేకిము॥

సీ॥ బాల్యమిత్రుఁడటంచుఁ బ్రతివానికిం జెప్ప
నాఁటి యాస్నేహ మెచ్చోటఁజనెనో
వేడ్క మదుద్వాహవిధికివచ్చి సుభూష
లిడు నాఁటియౌదార్య మేడఁజనెను
మేనల్లునింటికేఁగి బోసీక బలవంత
పెట్టునాఁటియపేక్ష యెట్టుచనెను
పత్రికవిషయమై పట్టినభారంబు
గొనునాఁటిగురుత యేపనికిఁజనెను
కాని శాఖాభిమానులగణముఁ జేరి
నేఁటికిన్ వాత్ర నాసె నన్నిఁ దివిడుఁడు
ఇన్నిటికిమూలభూతమై యొసఁగిన దెది
యనినఁ గొప్రంపువారి యాసనపుఁ జర్చ॥

రంపనిచేసేవారిని కంసాలీలుఅని అంటారు ప్రతివాదులుముగ్గురు నేను పైన చెప్పినవృత్తులలో తలావకవృత్తిచేసేవారు వున్నారు దావాదేవాలయములలోతిరిగి ప్రతిష్ట చేయవలెనంటేహీనపక్షము రు200-0-0లు కావలెను స్మృతిముక్తాఫలములో రథకారశబ్దమునకు తక్షు, శిల్పి, వర్ధకి, లోహకార, కర్మకార, అని పర్యాయపదములువున్నవి ప్రతివాదుల కులమునకు కమ్మరవారుఅనికూడా పేరువున్నది బ్రౌన్ Dictionary లో విశ్వబ్రాహ్మణశబ్దములేదు సూతసంహితలో * శివమహాత్మఖండములో 44 పేజీలో సృష్టిచేయుటలో తనకుసహాయముచేయుటకు 9 మంది ఋషులను సృజించి నట్లు చెప్పబడివున్నది

* సూతసంహిత 10వ అధ్యాయము-44 వ పేజీ.

శ్లో॥ సృష్ట్వావేదవిదాంముఖ్యాన్ సాధకానసృజత్పునః
మరీచిం నయనాభ్యాం హృదయాద్భృగుమేవచ
శిరస్యాంగీరసంచైవ తథోదానాద్ద్విజోత్తమాః।
పులస్త్యంపులహంవ్యానాద పానాత్క్రతుమీశ్వరః
దక్షంప్రాణాత్తథైవాత్రిం శ్రోత్రాభ్యాంమునిపుంగవాః
సమానాచ్చవసిష్ఠాఖ్యం సంకల్పాద్ధర్మసంజ్ఞితం
ఏవమేవాసృజచ్ఛ్రీమాన సృజత్సాధకోత్తమాన్

## ప్రధాన పోషకులు.

1. శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.
2. శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు కుమార జమీందారుగారు, గంపలగూడెం.

## సహాయులు.

14. కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట
15. తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు
16. వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.
17. తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
18. గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్కాట్ బ్రదర్సుకంపెనీ
19. చేకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమిదీపురం.
20. ఉల్లగంటి వీరరాఘవరావుగారు, మకాదారు, ఆనేపురం.

# ఈనెల సొమ్ముచెల్లించిన చందాదారులు.

1 భువనగిరి జయరామయ్యగారు, గుంటూరు
2. కంభంపాటి శివరామయ్యగారు, పల్లిగుంత.
3. పుల్చి రామయ్యగారు, పేరికలపూడి.
4. శివపురపు వీరభద్రపాకయాజగారు, మహబూబుకాలేజిపండితులు సికింద్రాబాదు.
5. ఘడియారం వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి.
6. వ్యాకరణం రామకృష్ణయ్యగారు, గుంటూరు.
7. బెల్లంకొండ రామకృష్ణరావు నరసింహారావుగార్లు, పమిడిపాడు.
8. మంచికంటి పాపరాజుగారు, చల్లగుండ్ల.
9. గుంటుపల్లి వీరయ్యగారు, కరణం చన్నుపల్లె.
10. చేబియ్యం వెంకట్రామయ్యగారు, రివిన్యూ యినస్పెక్టరు పులివెందల.
11. సి నాగేశ్వరరావుగారు, పోలీసుసబ్ యినస్పెక్టరు పిడుగురాళ్ళ.
12. డి. మోజెస్ సీనియర్ యింటర్మీడియట్, గుంటూరు.

# అభినవసరస్వతి

## పత్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇదియొకమాసపత్రిక-ఇందు ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును ప్రకటింపబడును ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలిక వ్యాసములవలన గలుగు నానందముగాక చందాదారులకు 2-3 అపూర్వగ్రంథములలవడును చందాసంవత్సరమునకు రు 2-0-0

### ఈకార్యస్థానమున వెలకుదొరకుపుస్తకములు.

| | | | |
|---|---|---|---|
| 1 | అళ్ళయాచార్యవిజయము | ... | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరె వీరభద్రకవి) | . | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము } ఇవి రెండు నాటకములు | .. | 0-4-0 |
| 4 | కంసవధము } ఇవి రెండు నాటకములు | .. | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి ( సింహాద్రి వెంకటాచార్యులు ) | . | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర | . | 0-2-0 |
| 7 | నీతిగీతలు ( సుమతి శతకమునకు సంస్కృతము ) | .. | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0-2-0 |
| 9 | అత్యద్భుతవిమర్శనము (మం॥ కృష్ణద్వైపాయనాచార్యులు. వెంకటరామకృష్ణకవులయవధానములపైవిమర్శనము) | .. | 0-5-0 |
| 10 | చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము ( పత్రికాధిపతి ) | . | 0-4-0 |
| 11 | సంగదోషము. ( సంగదోషముచే బట్టుదలవదలనియోగుల చరిత్రదెలుపు నొకచిన్న పద్యరూపమగుకథ | ... | 0-3-0 |
| 12 | వీరభాగవతము ( ముదిగొండ వీరభద్రకవి ) | .. | 1-4-0 |
| 13 | పుళిందావివాహము ( పత్రికాధిపతి) | . | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము | | 0-4-0 |
| 15 | శివానందలహరి ( తంగెడ రామకృష్ణకవి ) | . | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము( రాయసము వెంకటపతి ) | . | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము ( తిరుపతి వెంకటీయము ) | | 0-3 0 |
| 18 | పశ్యాంపుశ్యాం | ,, | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము | ,, | 0-2-0 |
| 20 | వేమవరాగ్రహార శతావధానము | ,, | 0-12-0 |
| 21 | పురశ్చరణము | ,, | 0-2-0 |

వలయువారలు సొమ్ముపంపిగాని, వి. పి. ద్వారాగాగాని, ఈ క్రిందివారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్

జానపాడు, పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.